శ్లో॥ ఓంకారం పూర్వముచ్చార్య భూర్భువః-స్వస్తథైవ చ।
గాయత్రీం ప్రణవం చాన్తే జప ఏవముదాహృతః॥

శ్లో॥ ధ్యాయేచ్చ మనసా మన్త్రం జిహ్వోష్ఠౌ న చ చాలయేత్।
న కమ్పయేచ్ఛిరో గ్రీవాం దన్తాన్నైవ ప్రకాశయేత్॥

శ్లో॥ కృతోత్తానౌ కరౌ ప్రాతః సాయం ముకులితౌ కరౌ॥
మధ్యే తిర్యక్కరౌ ప్రోక్తౌ జప ఏవముదాహృతః॥

శ్లో॥ విధియజ్ఞాజ్జపో యజ్ఞో విశిష్టో దశభిర్గుణైః।
ఉపాంశుః స్యాచ్ఛతగుణః సాహస్రో మానసః స్మృతః॥

శ్లో॥ వినా శబ్దం జపో యస్తు చలజ్జిహ్వోద్విజచ్ఛదః।
ఉపాంశుం తం జపం ప్రాహుర్మనసా మానసం బుధాః॥

శ్లో॥ పూర్వాం సన్ధ్యాం జపం స్తిష్ఠే త్సావిత్రీమార్క-దర్శనాత్।
పశ్చిమాన్తు సమాసీనః సమ్యగృక్ష విభావనాత్॥

మధ్యాహ్నే తు.—

శ్లో॥ తిష్ఠంశ్చేదీక్షమాణోఽర్కం జపం కుర్యాత్సమాహితః।
అన్యథా ప్రాఙ్ముఖః కుర్యాత్సమాసీనః కుశాసనే॥

ఆసనాన్యాహ వ్యాసః,—

శ్లో॥ కౌశేయం కమ్బలం చైవ అజినం పట్టమేవ వా।
దారుజం బలపత్రఞ్చ ఆసనం పరికల్పయేత్।
నాదీక్షితశ్చోపవిశేత్ కృష్ణసారాజినే గృహీ॥

జపసంపత్త్రిప్రకారమాహ వ్యాసః.—

శ్లో॥ మనఃసన్తోషణం శౌచం మౌనం మన్త్రార్థచిన్తనమ్।
అవ్యగ్రత్వ మనిర్వేదో జపసంసిద్ధిహేతవః॥

శ్లో॥ వస్త్రేణాచ్ఛాద్య స్వకరం దక్షిణం యః సదా జపేత్।
తస్య తత్సఫలం జప్యం తద్ధీనమఫలం భవేత్।



జపకాలే త్వక్షమాలాం గురోఽపి న దర్శయేత్ ॥

శ్లో॥ ఉల్లఙ్ఘితే తథా మేరౌ పతితే వాక్షసూత్రకే।
ప్రాణాయామత్రయం కృత్వా ఘృతప్రాశనమాచరేత్ ॥

శ్లో॥ పఙ్కజే శుష్కవస్త్రేణ స్థలే చైవార్ద్రవాససా।
జపో హోమస్తథా దానం తత్సర్వం నిష్ఫలం భవేత్ ॥

అథ జపమాలాప్రకారమాహ పాద్మే

శ్లో॥ అరిష్టం పత్రజీవఞ్చ శఙ్ఖం పద్మం తథా మణిమ్।
కుశగ్రన్థిఞ్చ రుద్రాక్షముత్తమం చోత్తరోత్తరమ్।

పాణిమాలా చేత్థమ్.—

శ్లో॥ అనామికాయా మధ్యే చ మధ్యాధః ప్రక్రమేణ చ।
తర్జన్యాదిగతా స్తే చ అక్షమాలా కరే స్థితా॥

అస్యార్థః । అనామికామధ్యరేఖామాదిం కృత్వా తదధః-క్రమేణ ప్రదక్షిణావర్తతర్జన్యా ఆదిరేఖా అన్తే కార్యా సేయం కరే స్థితా మాలా ఇత్యర్థః .—

ఆశ్రమవిశేషే జపవిశేషమాహ మనుః .—

శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థశ్చ శతమష్టోత్తరం జపేత్।
వానప్రస్థో యతిశ్చైవ ద్విసహస్రాధికం జపేత్ ॥

గృహస్థస్య సంఖ్యాన్తరముక్తం యామేన ,—

శ్లో॥ అష్టోత్తరశతం కుర్యాచ్చతుః పఞ్చాశికాపి వా।
సప్తవింశతికా కార్యా తతో నైవాధమా మతా।

దశావారమితి కార్యాన్తరాసక్తవిషయమ్

మన్త్రసిద్ధికామస్య చతుర్వింశతిలక్షజప ఉక్తః శారదాతిలకే.

శ్లో॥ తత్వలక్ష విధానేన భిక్షాశీ విజితేన్ద్రియః।
వ్యాహృతిత్రయసంయుక్తాం గాయత్రీం దీక్షితో జపేత్॥

కామ్యవిశేషేణాఙ్గులివిశేషః .—

శ్లో॥ అఙ్గుష్ఠం మోక్షదం విద్యాత్తర్జనీ శత్రునాశనీ।
మధ్యమా ధనసిద్ధ్యై స్యాచ్ఛాన్తికర్మణ్యనామికా।
కనిష్ఠాకర్షణే జ్ఞేయా జయకర్మణి సిద్ధిదా॥

కూర్మచక్రే దీపం దత్వా జపే సర్వసిద్ధిరితి కూర్మచక్రముచ్యతే.—

శ్లో॥ వర్తులం నవకోష్ఠం తత్కృత్వా కూర్మాకృతింలిఖేత్।
స్వరయుగ్మక్రమేణైవ ఐన్ద్ర్యాదిద్వ్యష్టసు దిక్షు చ॥

శ్లో॥ కాదీన్ వర్గాన్ తమీశాన్యాం తథా మధ్యే స్థలాధిపమ్।
తన్నామాద్యక్షరం యచ్చ కూర్మాస్యం తచ్చ దీపకమ్॥

శ్లో॥ తత్పార్శ్వకోష్ఠౌ హస్తౌ ద్వౌ అధో౽ధః కుక్షిపాదకౌ॥
శేషం కోష్ఠం భవేత్పుచ్ఛం ముఖే సిద్ధిరనుత్తమా॥

శ్లో॥ కరస్థానే మహాక్లేశః కుక్షౌ దుఃఖమవాప్నుయాత్ !
పదోర్హాని స్తథా పుచ్ఛే పీడా స్యాద్బన్ధనాదిభిః॥

శ్లో॥ మోక్షార్థీ వదనే కుర్యాద్దక్షిణే త్వాభిచారికః।
శ్రీకామః పశ్చిమే కుర్యాదుత్తరే శాన్తిదం భవేత్॥

శ్లో॥ ఈశాన్యే శత్రునాశః స్యాదాగ్నేయే శత్రువర్ధనమ్।
నైరృత్యే శత్రుభీతిః స్యాద్వాయవ్యేతు పలాయనమ్॥

శ్లో॥ గ్రామే దేవే వనే వాపి యత్ర కుత్రావలోకయేత్।
దీపస్థానే జపః కార్యః సర్వసిద్ధిమభీప్సుభిః॥

శ్లో॥ కూర్మచక్రమవిజ్ఞాయ యః కుర్యాజ్జపయజ్ఞకమ్।
తస్య జాప్యఫలం నాస్తి సర్వానర్థాయ కల్పతే॥

హోమస్తు .—

శ్లో॥ క్షీరోదనతిలా దూర్వా క్షీరద్రుమసమిద్వరైః।
పృథక్సహస్రత్రితయం జుహుయాన్మన్త్రసిద్ధయే॥

శ్లో॥ తత్వసంఖ్యాసహస్రాణి మన్త్రవిజ్జుహుయాత్తిలైః।
సర్వపాపవినిర్ముక్తో దీర్ఘమాయుః స విన్దతి॥

శ్లో॥ అరుణాబ్జైస్త్రిమధ్వక్తైర్జుహుయాదయుతం తతః।
మహాలక్ష్మీర్భవేత్తస్య షణ్మాసాన్నాత్ర సంశయః॥

శ్లో॥ బహునా కిమిహోక్తేన యథావత్సాధుసాధితా।
ద్విజన్మనామియం విద్యా సిద్ధా కామదుఘా మతా॥ ఇతి॥

ఇత్యుక్తప్రకారేణ యథాశక్తి జపం కృత్వా గాయత్రీ-ధ్యానం షడంగన్యాసంచ విధాయ ఉత్తమే శిఖరే దేవీతి గాయత్రీం విసర్జ్య బ్రహ్మార్పణం కార్యమ్॥ యోగియాజ్ఞవల్క్యః:—

శ్లో॥ కరే నీరం సమాదాయ దేవా గాత్వితి మన్త్రితః।
నివేదయేజ్జపం ప్రాతః ప్రయోగస్తత్ర కథ్యతే॥

శ్లో॥ ప్రాతః సన్ధ్యాంగభూతేన గాయత్ర్యాస్తు జపేన చ।
సాష్టేన శతసంఖ్యేన బ్రహ్మామే ప్రీతాం రవిః॥ ఇతి॥

అత్ర జపాత్ పూర్వం పశ్చాద్వా ఉభయత్ర వా ముద్రాః-దర్శనీయాః అత్రాన్తరే గాయత్రీతర్పణముక్తమ్॥

## అథ అభివాదనమ్

తత్ర యాజ్ఞవల్క్యః :—

శ్లో॥ సన్ధ్యాఞ్చ విధివత్కృత్వా సన్ధ్యయోరుభయోరపి।
తతోఽభివాదయేద్వృద్ధా నసావహమితి బ్రువన్॥

శ్లో॥ అవాచ్యో దీక్షితో నామ్నా యవీయానపి యో భవేత్।
భో భవత్పూర్వకం త్వేనమభిభాషేత ధర్మవిత్॥ ఇతి యమః.

శ్లో॥ ఆయుష్మాన్ భవ సౌమ్యేతి వాచ్యో విప్రోఽభివాదనే।
అకారశ్చాస్య నామ్నోఽన్తే వాచ్యః పూర్వాక్షరః ప్లుతః॥

పాణినిరపి 'ప్రత్యభివాదేఽశూద్రే' ఇతి । ప్రత్యభివాదే టేః ప్లుతో భవతి న తు శూద్రే ఇతి సూత్రార్థః॥ స్త్రియామపి నిషేధ ఇతి కాత్యాయనవచనాత్ స్త్రియామపి ప్రత్యభివాదనవాక్యే న ప్లుతః। గోవిన్దరాజస్తు బ్రాహ్మణస్య నామ్ని శర్మోపపదం నిత్యం ప్రాగభిధాయ ప్రత్యభివాదన వాక్యే ఆయుష్మాన్ భవ సౌమ్య భద్ర ఇతి వదన్ నిరుపపదసోపపదోదాహరణానభిజ్ఞత్వమేవ నిజం జ్ఞాపయతి తథాచాయం ప్రయోగః ఆయుష్మాన్ భవ సౌమ్య దేవదత్తశర్మా౩ది॥

శ్లో॥ యో న వేత్త్యభివాదస్య విప్రః ప్రత్యభివాదనమ్।
నాభివాద్యః స విదుషా యథా శూద్రస్తథైవ సః॥

శ్లో॥ జపయజ్ఞజలస్థశ్చ సమిత్పుష్పకుశానలాన్।
ఉదపాత్రార్ఘ్యమ (క్షా) ధ్వాజ్యం వహన్తం నాభివాదయేత్।

శ్లో॥ పాషణ్డం పతితం వ్రాత్యం మహాపాతకినం శఠమ్।
సోపానత్కం కృతఘ్నఞ్చ నాభివాదేత్కదాచన॥ ఇతి బృహస్పతిః॥

శ్లో॥ యస్య దేశం న జానాతి స్థానం త్రిపూరుషం కులమ్।
కన్యాదానం నమస్కారం శ్రాద్ధం తస్మై వివర్జయేత్॥ ఇతి మనుః॥

శ్లో॥ సభాయాం యజ్ఞశాలాయాం దేవతాయతనేష్వపి।
ప్రత్యేకన్తు నమస్కారో హన్తి పుణ్యం పురాకృతమ్॥

తస్మాత్ సభాస్థేభ్యః సకృదేవ నమస్కుర్యాదితి భావః। సంధ్యాయాన్తు యమోక్తో విశేషః.—

శ్లో॥ జాయానపి కనీయాంసం సన్ధ్యాయామభివాదయేత్।
వినా పుత్రాంశ్చ శిష్యాంశ్చ దౌహిత్రాన్ దుహితుః పతిమ్॥

## అథ త్రికాలసంధ్యాప్రయోగః

### ఓం నమో భగవతే కాత్యాయనాయ

సూర్యోదయాత్పూర్వం ఘటికాద్వయం ప్రాతః సన్ధ్యాయా ముఖ్యకాలః। తథా సాయం సూర్యాస్తమయాత్ పూర్వం ఘటికాద్వయమ్ । అథ సన్ధ్యాముపాసీత యా వహోరాత్రయోః సన్ధి యశ్చ పూర్వాపరాహ్ణయోస్తత్కాలభవా దేవతా సన్ధ్యా తాముపాసీత॥

తా. ప్రాతఃసన్ధ్య నుపాసించుటకు ముఖ్యకాలము సూర్యోదయమునకు ముందు రెండు ఘడియలకు, అట్లే అస్తమయమునకు ముందు రెండు ఘడియలకు సాయం సన్ధ్యోపాసనకు ముఖ్యకాలము (4 పుట 6 పంక్తిచూడుము) సకాలమునకు విత్తునాటని సస్యము లెట్లు సంపూర్ణముగ ఫలింపవో యట్లే ముఖ్యకాలమునచేయని సంధ్యయును.

రాత్రికిని బగటికిని ౧ బగటికిని రాత్రికిని ౨ పూర్వాహ్ణమునకును అపరాహ్ణమునకు ౩ గలియు సంధ్యాకాలములందగు దేవత యయిన సంధ్య నుపాసింప వలెను: అనగా నుదయమున రక్తవర్ణముగను, మధ్యాహ్నమున తెల్లగను, సాయంకాలమున నల్లగను నుండు సూర్యునియొక్క తేజశ్శక్తి నుపాసింపవలెను.

అట్లగుటచేత నేగదా యుత్పత్తిస్థితిలయములకు త్రిమూర్తి స్వరూపమైన యాతేజశ్శక్తికి నుదయమున గాయత్రి యని పేరిడి బ్రహ్మరూప, బాల, బాలాదిత్య మండలస్థ, రక్తవర్ణ యనియు, మధ్యాహ్నమున సావిత్రి యను పేరున రుద్రరూప, యువతి, యువాదిత్యమండలమధ్యస్థ శ్వేతవర్ణ యనియు, సాయంకాలమున సరస్వతి యను నామంబుతో విష్ణురూప, వృద్ధ, వృద్ధాదిత్యమండలమధ్యస్థ, శ్యామవర్ణ యని వర్ణింపగలిగిరి. (2 పుట 19 పంక్తి) అట్టి 'తేజశ్శక్తిస్వరూపుడను నేనగుచున్నాను' అను దృఢబుద్ధితో ధ్యానింపగలుగుటయే యుపాసనమనబడుచున్నది.(3 పుట 8పంక్తి)

అట్టు సంధ్య యనబడు తేజశ్శక్తి నుపాసించుటచే దీర్ఘాయుష్యము, ప్రజ్ఞ, యశస్సు, బ్రహ్మవర్చసము గలుగు ననుట కెంతమాత్రము సందేహము లేదు. (6 పుట 22 పంక్తి). ఈ సంధ్యోపాసనము నందలి ప్రతిమంత్రమునకు ౧ ఋషి, ౨ దేవత, ౩ ఛందస్సు, ౪ వినియోగములను (10పు. 20పం.) అర్థమును(9పు. 5పం.) తెలిసికొని చేయవలెను.

## విష్ణుస్మరణమ్ = మానసస్నానమ్

* శ్లో॥ అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా
యః స్మరేత్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతర శ్శుచిః ॥

* శ్లో॥ [illegible]తి సదా స్నానం గోవిన్దేతి సదా జపః ।
గోవిన్దేతి సదా ధ్యానం సదా గోవిన్దకీర్తనమ్ ॥

పుణ్డరీకాక్ష! పుణ్డరీకాక్ష! పుణ్డరీకాక్ష!

తా. ఎవడు (సదాచారము వలన) పరిశుద్ధు డయినను (దురాచారము వలన) నపరిశుద్ధు డయినను, కాలకృతమయిన స్థితులను బొందినవాడయినను, మనస్సునందు పుండరీకాక్షుని (తెల్లదామరవంటి కన్నులు గల విష్ణుని) దలచునో వాడు లోపల వెలుపల శుచిగలవాడు (అగును). ఎప్పుడును 'గోవిన్ద' అని స్నానము, 'గోవిన్ద' అని జపము 'గోవిన్ద' అని ధ్యానము 'గోవిన్ద' అని కీర్తనము (జేయవలయును) లేక ఎల్లపుడును 'గోవిన్ద' అనుటయే, స్నానము, జపము, ధ్యానము, కీర్తనము (అగును).

### ఆచమనము (16 పుట)

* స్మార్తాచమనం కృత్వా । స్మార్తాచమనము జేసి

(16 పు. 4 పం. జూడుము) కాత్యాయన పరిశిష్ట సూత్రమునందు

'ఆమాగన్మశసా' అనుమంత్రముతో జేసి 'వాఙ్మ ఆస్యే'

అని అంగన్యాసము (17 పు. 12 పం.) జేయవలయుననికలదు గాన కాత్యాయన సూత్రుల కెల్లరకు నిదియే ముఖ్యము. కొందఱిమతమున కుడిచేతియందలి బ్రహ్మతీర్థముతో నమంత్రముగా 3 తడవలు గాని భావశుద్ధికొఱకు నాల్గుతడవలు గాని యాచమించి పిమ్మట అంగన్యాసముచేసి కేశవాదులతో (19 పు. 15 పంక్తిలో కేశవనామములు కలవు) గూడ జేయవలశిన దని యున్నది మఱికొందఱ మతమునందు కేవల కేశవాదులతో జేయుటయే స్మార్తాచమనము. ఆచమనము జేయునపుడు చేత పవిత్రము ధరించి తూర్పు దిక్కునకుగాని ఉత్తర దిక్కునకు గాని తిరిగియుండవలెను. ఉదకాభావమయినపుడు, అసామర్థ్యుడయినపుడు దక్షిణకర్ణమును (కుడిచెవిని) స్పృశించవలయునని

కాణ్వశాఖ నుద్ధరించిన మహానుభావుడగు అనంతభట్టుచే రచింపబడిన విధానపారిజాతము నందలి తృతీయ స్తబకమునందున్నది.:—

'ఉదకాభావే అసామర్థ్యే చ దక్షిణం కర్ణం స్పృశేత్ । తదాహ బృహస్పతిః శ్లో॥ నిమిత్తేష్వేషు సర్వేషు దక్షిణం శ్రవణం స్పృశేత్ । ఆదిత్యా వసవో రుద్రా వాయురగ్నిశ్చ ధర్మరాట్ । విప్రస్య దక్షిణేకర్ణే నిత్యం తిష్ఠన్తి వైయతః॥ అత్రి హేతు మాహపరాశరః:—శ్లో॥ ప్రభాసాదీని తీర్థాని గఙ్గాద్యాః సరితస్తథా । విప్రస్య దక్షిణేకర్ణే వసన్తీతి మనోర్మతమ్)

## ఉపవేశనమ్

* పృథ్వీత్యస్య ౧ మేరుపృష్ఠఋషిః ౨ కూర్మోదేవతా 3 సుతలం ఛందః ౪ అసనే (ఆసనారోహణే) వినియోగః

ఓం పృథ్వి త్వయా ధృతా లోకా దేవి త్వం విష్ణునా ధృతా। త్వం చ ధారయ మాం దేవి పవిత్రం కురు చాసనమ్ ॥

( గాయత్రీకల్పే )

ఈ యుపవేశనమంత్రము గాయత్రీ కల్పములోనిది. దీనికి ఋషిదేవతాఛందస్సులను దెల్పినది వ్యాసులు. (శ్లో॥ పృథివ్యా మేరుపృష్ఠం తు ఋషిరిత్యభిధీయతే కూర్మపృష్ఠం దేవతా తు సుతలం ఛంద ఈరితం ఆసనారోహణే తస్య వినియోగః ప్రకీర్తితః॥) తా. ఓ భూదేవి నీచే లోకములు వహింపబడినవి. దేవి నీవు విష్ణువుచే ధరింపబడితివి. నీవు నన్ను (భారమనక) వహింపుము మఱియు నీపీఠమును బవిత్రము చేయుము—

## ప్రాణాయామః (25 పుట 17 ం క్తి)

1 ప్రణవస్య ౧ పరబ్రహ్మఋషిః ౨ పరమాత్మాదేవతా 3 దైవీగాయత్రీ ఛందః

2 సప్తానాం వ్యాహృతీనాం ౧ ప్రజాపతిఋషిః అగ్ని-వాయుసూర్య బృహస్పతి-వరు-ణేన్ద్ర-విశ్వేదేవా ( క్రమాత్ ) దేవతాః గాయ-త్ర్యుష్ణి-గనుష్టుప్- బృహతీ-పంక్తి- త్రిష్టు- బ్జగత్య

3 తత్సవితురిత్యస్య ౧ విశ్వామిత్రఋషిః ౨ సవితా దేవతా
౩ గాయత్రీ ఛందః

4 శిరోమంత్రస్య (ఆపోజ్యోతిరిత్యస్య వా) ప్రజాపతి ఋషిః
౨ బ్రహ్మాగ్నివాయుసూర్యా దేవతాః ౩ యజుశ్ఛందః సర్వేషాం
(1.2.3.4) ప్రాణాయామే వినియోగః

* 1 ఓం భూః, ఓం భువః, ఓగ్ంస్వః (సువః) ఓం మహః ఓం జనః, ఓం తపః, ఓగ్ంసత్యమ్॥ (2) ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్॥ 3 ఓమాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువః స్వరోమ్

(భూర్భువః స్వః అధ్యాయ ౩౬ అనువాక ౧ ఖండ 3, గాయత్రీ అ 3 అను 3 ఖండ ౨౪)

తా. సంహితయందలి 36 అధ్యాయములో ముల్లోకములను దెలుపు వ్యాహృతి త్రయము మాత్రమే కలదు. యోగి యాజ్ఞవల్క్యులు లోనగువారలు ప్రాణాయామమందు సప్త వ్యాహృతులను, గాయత్రిని, శిరోమంత్రమును, ప్రణవ సహితముగా నుచ్చరించ వలయు నని తమ స్మృతులందు వ్రాసిరి. గాన వ్యాహృతు లేడును సప్తలోకములను దెలియజేయును. ఆలోకము లన్నియును ఓంకారమున కథనమగు పరబ్రహ్మస్వరూపమే యని తెలుపుటకు ప్రతి వ్యాహృతికిని మొదట ఓంకారమునుజేర్చి పలుకు చున్నారు ఓంభూః-అనగా భూలోకము ఓంకార పదవాచ్యమగు పరబ్రహ్మము. దీప్తిక్రీడాయుక్తుడగు జగత్స్రష్టయొక్క తేజస్సును ధ్యానించెదము. ఆ తేజం బెట్టిదన మాబుద్ధివృత్తులను ధర్మార్థకామ మోక్షములందు బ్రేరేపించునదియు నెల్లరచే గోరదగినదియునయియున్నది.

శిరోమంత్రమున కథనము:—నదులు, సముద్రములు మొదలగువానియందలి జలమును, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, మెఱుపు, లోనగువానియందలి తేజస్సును, తీపి, పులుపు, వగరు మొదలగు రసము లారును, దేవతలచే ద్రాగబడిన యమృతమును ఓంకారమున కథనమగు పరబ్రహ్మమే॥

ప్రాణాయామము సమంత్రము (మంత్రసహితముగా చేయునది) అమంత్రము (మంత్రము లేక చేయునది) అని ద్వివిధము. సంధ్యాదిని దర్భపవిత్రము చేత నంచుకొని ఒక్కొక్కటి 15 మాత్రలకాలము చొప్పున మూమ్మారు చేసి ఆయతప్రాణుడయి సకృత్తుగా ప్రణవము, వ్యాహృతులు, శిరోమంత్రము వీనితో గూడిన గాయత్రిని మూమ్మారు దలచుట సమస్త్ర ప్రాణాయామము.

అభ్యసించు విధము:—అభ్యాసకుడు మొదట లోని విషవాయువు వెలికిబోగొట్టి కుడిచేతి బొటనవ్రేలితో గుడిముక్కు రము మూసికొని యెడమముక్కు రముతో నెమ్మదిగా పూరకము చేయవలయును. అట్లు పూరించిన తర్వాత కుంభించి కుడిచేతి తర్జనీ మధ్యమవ్రేళ్ళతోగాని, మధ్యమానిమికలతోగాని యెడమముక్కు రము మూసి కుడిముక్కు రమునుండి నెమ్మదిగా రేచకము చేయవలయును. వెలుపలి వాయువు లోనికి ప్రవేశపెట్టుట పూరకము. ప్రవేశపెట్టినదానిని నిలుపుట కుంభకము దీనియందే జపించవలయును. లోన నిల్చిన వాయువును వెలికి బోగొట్టుట రేచకము.

మంత్రములకు ఋషి, దేవత, ఛందస్సు, వినియోగము, వీనిని తెలియకపఠించినను, ఒకరిచే పఠింపించినను, మహాపాపి యగును (10పు. 20ప.) గాన వేదమునందలి మంత్రములకు వానిని దెలిసికొనుటకు భగవంతుడగు కాత్యాయనుడు సర్వానుక్రమసూత్రమును రచించెను. అందు ఓంకారమునకు “ఓమితినామనిర్దేశో బ్రహ్మణః । ఓమితి పరమాత్మురస్య యోగినామాలంబభూతస్య పరమస్య బ్రహ్మణః ప్రణవాఖ్యం స్థూలాదిగుణయుక్తస్య బ్రహ్మ ఋషిశ్ఛందో గాయత్రం పరమాత్మా దేవతా । బ్రహ్మారంభే విరామే ప్రయోగహోమాదిషు యాగహోమాదిషు శాన్తి పుష్టి కర్మసు కామ్యనైమిత్తికాదిషు సర్వేషు వినియోగోఽస్య, గాయత్రి=తత్సవితుర్విశ్వామిత్రః సావిత్రీం గాయత్రీమ్) అసప్తవ్యాహృతులకును శిరోమంత్రమునకు ఋషిదేవతాదులను యోగియాజ్ఞవల్క్యులు లోనగువారు తెల్పిరి. (శ్లో॥ వ్యాహృతీనాంతు సర్వాసా మార్షంచైవ ప్రజాపతేః । గాయత్ర్యుష్ణి గనుష్టుప్ చ బృహతీ త్రిష్టుబేవ చ । పంక్తిశ్చ జగతీచైవ ఛందాస్యేతాని సప్తవై । అగ్ని ర్వాయు స్తథా సూర్యో బృహస్పతిరపాంపతిః ఇన్ద్రశ్చ విశ్వేదేవాశ్చ దేవతాసముదాహృతాః । ఓమాపో జ్యోతిరిత్యేష మన్త్రో వై తైత్తిరీయకే । తస్య ప్రజాపతేరార్షం ఛన్దోహీనం యజుర్యతః । బ్రహ్మాగ్ని వాయుసూర్యాశ్చ దేవతా సముదాహృతాః । ప్రాణస్య యమనే చైవ వినియోగః ప్రకీర్తితః॥ ఇతి విధానపారిజాతే తృతీయస్తబకే) కృష్ణయజుర్వేదులకు ఛందస్సులేదు గాన యజుస్సే ఛందస్సనుచున్నారు.

సంకల్పః (పుట 27.13 పంక్తి)

శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్యాద్యబ్రహ్మణో ద్వి-

తీయపరార్ధే శ్వేతవారాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే (భారత ఖండే) మేరోర్దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్యేశాన్యప్రదేశే ( గంగా గోదావర్యోర్మధ్యదేశే ( కృష్ణా గోదావరులకు మధ్య దేశమునునుండువారు కృష్ణాగోదావర్యోర్మధ్యదేశే అనిచెప్పుకొనవలయును.) అగ్నికోణే ఆంధ్రదేశే అస్మిన్వర్తమానవ్యావహారిక చాంద్రమానే... ...సంవత్సరే ... ...అయనే... ఋతౌ... మాసే... ...పక్షే... ... వాసరే శుభనక్షత్రే శుభయోగే శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ ... ...గోత్రః ... ...నామధేయః శ్రీమతః - గోత్రస్య నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమోపాత్తదురిత క్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతఃసన్ధ్యాముపాసిష్యే (మధ్యాహ్నమునందు) మాధ్యాహ్నికసంధ్యాముపాసిష్యే ( సాయంకాలమున ) సాయం సంధ్యాముపాసిష్యే అని ఆయాకాలములందు చెప్పుకొనవలయును.

మార్జనమ్=మంత్రస్నానమ్ (పుట 28 పంక్తి 18

* ఆపోహిష్ఠేతి తిసృణాం ౧ సిన్ధుద్వీపఋషిః ౨ ఆపోదేవతా 3 గాయత్రీఛందః ర మార్జనే వినియోగః

ఓం ఆపోహిష్ఠా మయోభువః (ఇతి మస్తకే=(శిరస్సుపై దర్భలతోగాని, దేవతీర్థముతోగాని యుదకము చల్లుకొనవలెను.) తాన ఊర్జే దధాతన ( ఇతి భూమౌ అనగా పాదములపై ) మహేరణాయ చక్షసే ( ఇతి హృదయే=హృదయమందు)

౨ యోవః శివతమో రసః (ఇతిహృదయే) తస్య భాజయతేహనః (ఇతి భూమౌ) ఉశతీరివ మాతరః ( ఇతి మస్తకే ) తస్మా

అరంగమామవః (ఇతి మస్తకే) యస్య క్షయాయ జిన్వథ (ఇతి హృదయే) ఆపో జనయథా చ నః (ఇతి భూమౌ)

(ఆపో, అధ్యాయ ౧౨ అను ౫ ఖండ ౧, యోవః ౧౨-౫-౨ తస్మాఅరం ౧౨-౫-౪ )

మార్జనమంత్రములు ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములు మూటియందుసమానమే

తా॥ విధానపారిజాతమున దు శుచియగు పాత్రిలోగాని, ఎడమచేతగాని జలముంచుకొని అందు 'శ్లో॥ గఙ్గే చ యమునే చైవ గోదావరి సరస్వతి నర్మదే సిన్ధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు॥ అని తీర్థావాహనం జేసి దర్భసహితమగు పాణితో (అంగుల్యగ్రములతో అనగా దేవతీర్థముతో శిరస్సునందు 3, హృదయమందు 3, పాదములమీద 3 మొత్తము తొమ్మిదిమార్జనలు (పు. 29 పం 2) జాగ్రత్స్వప్నసుషుప్తిజాది దోషములతొమ్మిది దహించుటకు ఆపోహిష్ఠాది మంత్రములతో జేసికొనవలయునని యున్నది. (అథ కర్మ సఙ్కల్ప్య శుచౌ పాత్రే సవ్యేపాణౌ వా ఆప ఆధాయ స్థిరే తీర్థాదికాళరయే యావతి కర్మకుర్వీత తావత ఉదకస్య విభాగం కల్పయిత్వా తీర్థాని సమావాహ్య తా అపః సదర్భేణ పాణినా ఆదాయాదావేవ శిరసి మార్జయేదోంపూర్వ్యం అథ ఆపో హిష్ఠేతి తిసృభిః॥ శ్లో॥ భూమౌ మూర్ధ్ని తథాకాశే మూర్ధ్న్యాకాశే తథాభువి। ఆకాశే భువి మూర్ధ్ని చ స్యాన్మార్జనం విధీయతే॥) ఆకాశే=హృదయే। భూమౌ=పాదయోః.

తా॥ ఓజలములార మీరెల్లగకను స్నానపానాదులకు హేతువులై (ఉపయోగపడుచు) సుఖమును గలిగించుచున్నారు. కాన రమణీయమగు పరమాత్మదర్శనమునకై మిమ్ము సేవించు మమ్ము పోషింపుడు. పరమాత్మను దర్శించుటయే మోక్షరూపమగు ఫలము అట్టిపూజనీయమగు ముక్తియనెడు గొప్పప్రయోజనమునకై మీ భక్తులమగు మమ్ము పోషింపుడు అట్లుమోక్షముకాలేకయుగానిచో బ్రతుకుట వ్యర్థమని యభిప్రాయము.

మఱియు నో జలంబులార మిగుల మేలు గలిగించునదియై మాధుర్యరూపంబగు మీ యొక్క రసంబు కల దద్దాని కీ భూతలంబున మనుజరూపంబున వఱిల్లు మమ్ములను పాత్రులనుగా జేయుడు. అనగా మిగుల మేలుజేయునదియు దివ్యనదియు నగు మీరసంబునకు మమ్ముల స్థానంబుగా జేయుడని యర్థము. చెంబులు లోనగు పాత్రలయందు నీరుండులాగునమా యందుమీమధురరసంబుండు గాక యనిభావము. ఈవిషయంబున నిదర్శ

నము జూపుచున్నాడు. అదెట్లన దమసంతానముయొక్క యభివృద్ధినిగోరుచు గోధుమల యందును మినుములయందును ప్రేమగలగల్లులు తమపిల్లలకు మంచిపెంచి తియ్యని పదార్థముల బెట్టులాగున మీమధురరసంబునకు మమ్ములను పాత్రులనుజేయుమని భావము.

మఱియు నో జలంబులార మేము మిమ్ములను గడుశరణంబు నొందుచున్నారము. ఎందునకీశరణము నొందుట యనగా మాయొక్క యేపాతకజాలంబు నశించుటకొఱకు మీరు ప్రీతినిజెందెదరో యట్టిపాపంబుల క్షయంబుకొఱకె (మిమ్ములను శరణంబునొందుట).

ఓ జలములారా భక్తులయందు ప్రీతిగలవారగుటవలన మీరు మాపాపముల క్షయముకొఱకే మాభక్త్యనుసారముగా ప్రయత్నం బొనరించుచున్నారు. మే మిందుకొఱకే మీచరణంబులను శరణంబు జేసికొనుచున్నవారము. అట్లు మేము శరణంబు నొందకున్న మాపాతకంబులు మొదలంట నాశనమునకయి మీరు ప్రయత్నించు టెట్లు? అని భావము. మఱియు నో జలాధిష్ఠానదేవతలార మమ్ములను, బుత్రులను, మనములను గను సమర్థతగలవారినిగా జేయుడు. సర్వానుక్రమసూత్రమ్: ఆపోహ్యాపగం సిన్ధుద్వీపస్త్వాష్ట్రం గాయత్రమ్.

సమన్త్రముదకపానమ్ ( 31_30 పుట 20-9 పంక్తి)

* ద్రుపదాదివేత్యస్య (మంత్రస్య) ౧ కోకిలరాజపుత్రఋషిః ౨ ఆపోదేవతా ౩ అనుష్టుప్ ఛందః ౪ (ఉదకప్రాశనే వినియోగః)

ఓం ద్రుపదాదివ ముముచానః స్విన్నః స్నాతో మలాదివ।
పూతం పవిత్రేణేవాజ్యమాపః శున్ధన్తు మైనసః॥ (అ.౪2 అ.1 ఖ.6)

స్వాహా అని జలప్రాశనముచేయుమనిరి.

తా॥ రాజులు దొంగతనము మొదలగు నపరాధము లొనర్చిన వాని పాదమును (కాలు దూరు నంతటి) రంధ్రముగల కొయ్యయందు బెట్టి చీల బిగియించెదరు. ఆ కొయ్యకే ద్రుపదమని పేరు. అదే బొండకొయ్య. అట్టి బొండకొయ్యవలన విడుదలచేయబడినవాడు దొంగతనము లోనగు నేరముల దోషంబుల దొలంగి శుద్ధుడని వ్యవహరింపబడునట్లును, చెమ్మటజెందినవాడు స్నానముజేసి శరీరమునుండి మురికి బోగొట్టుకొని శుద్ధుడని చెప్పబడునట్లును, కర్మణాయందు ఉత్పవనమునకయి యేర్పడిన పవిత్రముచేత

నేయి శుద్ధం బగునట్లును, ఈజలంబులు నన్ను పాపమునుండి విముక్తునిజేసి పరిశుద్ధుని జేయుగాక॥

ఈ మంత్రము జలప్రాశనయం దుపయోగింప బడుచున్నదని చెప్పుటకు పూర్వులు ముద్రించిన పుస్తకమునందలి "పూర్వమార్జనతః పశ్చాద్వేదేవాజసనేయకే । ద్రుపదా నామగాయత్ర్యా త్వభిమంత్ర్య జలం పిబేత్", అను నిర్మూలశ్లోకము తప్ప వేరొక టిక్కడచ్చుటను లేదు. ఈ శ్లోకము కాత్యాయనస్మృతియందున్నదనిరిగాని ఎందరుజూచినను నదియచ్చట నగపడకున్నది గాన నిది కేవల కల్పితశ్లోకమయినట్లు క్రిందివానివలన కూడ నేటపడును. బృహస్పతిః—శ్లో॥ ద్రుపదానామ యావస్త్రో వేదే వాజసనేయకే। అన్తర్జలే త్రిరావర్త్య సర్వపాపైః ప్రముచ్యతే॥ యోగి యాజ్ఞవల్క్యః– ద్రుపదానామ సా దేవీ యజుర్వేదే ప్రతిష్ఠితా । అన్తర్జలే త్రిరావర్త్య మాచ్యతే బ్రహ్మహత్యయా॥ విధానపారిజాతే స్నానవిధౌ-శ్లో॥ ద్రుపదాం వా త్రిరావర్త్య అయం గౌరితి వా ఋచమ్‌ప్రాణాయామం సశిరసం జలే జప్త్వా త్ర్యృర్జపేత్తథా। ఆవర్తయేద్వా ప్రణవం స్మరేద్వా విష్ణుమవ్యయమ్॥ అఘమర్షణే షట్‌పఞ్చా వాజస నేయి విషయాః॥ ఇతి, తత్రైవ సన్ధ్యావన్దన విధౌతు అథ గోకర్ణవత్ కృతేన పాణినా ఉదకమాదాయ నాసికాగ్రే ధారయన్ కృష్ణఘోరపురుషాకృతిం పాప్మానమాత్మానమన్తర్వ్యాప్యస్థితం విచిన్త్య సంయతప్రాణో ఘమర్షణసూక్తం ద్రుపదాపృచం చావర్త్య దక్షిణేన నాసావివరేణ శనైః ప్రాణం రేచయన్ సర్వతస్తేనః సంహృత్య కృష్ణం స్వేన వర్త్మనా పాణిస్థ ఉదకే పాతితం ధ్యాత్వా తముదకమవేక్షమాణో వామతో భువి తీవ్రపాతేన క్షిప్త్వా తం పాప్మానం వజ్రహతం సహస్రధా దలితం భావయేదేష పాప్మవ్యపోహః। ఏనమేకే న కుర్వంతి। మార్జనేనైవతస్య వ్యపోహితత్వాత్। ఇతి ద్రుపదర్క- (పాపశోధనీ) అని యుండుటే గాక స్మృతులం దెచ్చటజూచిన నిది యఘమర్షణమందే వినియోగింప వలయు నని తెలుపబడుచున్నదిగదా. మార్జనవలన బాహ్యశుద్ధియే గాని అన్తఃశుద్ధి కలుగదు గాన మంత్రాచమన ముండితీరవలయును, గాన ప్రాతఃకాలమందు 'సూర్యశ్చ' అను మంత్రముతోను, మధ్యాహ్నమునందు 'ఆపః పునన్తు' అను మంత్రముతోను, సాయంకాలమున 'అగ్నిశ్చ' అను మంత్రముతోను మంత్రాచమనము చేయవలయును. ఇందునకు ప్రమాణము విధానపారిజాతమునందు (అథాచమనముదకమాదాయ సూర్యశ్చేతి పిబేదేతత్ సమన్త్రమాచమనమ్) (ఏవం సాయమపి విశేషస్తు సూర్యశ్చేతి మన్త్రే అగ్నిశ్చేతి బ్రూయాత్ అథ మధ్యన్దినే తు ఆపః పునన్త్వితి మంత్రాచమనం కృత్వా) అని గలదు గాన పేరునకు మాత్రమే ప్రథమశాఖయైయుండి సర్వవిషయములలో అన్నిశాఖలకన్న వెనుకనున్నది. ఇట్లుండుటకు దగిన గ్రంథములు లేక పోవుటయే యని తలచి కాణ్వుల కెల్లరకు సర్వవిషయముల నుపయోగపడుటకు అసమానమయిన విధానపారిజాత మను స్మృతినిబంధనమును రచించెను, గాన దీనికన్న ప్రమాణ మేమి గావలయును. 'ద్రుపదాదివ' అను మంత్రముతో నఘమర్షణము పునమార్జ

జపానంతరము చేయవలయును. అమంత్రము నే మఱల వ్రాసినచో గ్రంధవి స్తరమగు ను గాన (అఘమర్షణే వినియోగః) అనునది మాత్రమే మార్చి చెప్పుకొనవలయును.

* సూర్యశ్చమేత్యస్య । నారాయణఋషిః । సూర్యో దేవతా అనుష్టుప్ ఛందః । ఉదకప్రాశనేవినియోగః ॥

ఓం సూర్యశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః పాపేభ్యో రక్షన్తాం యద్రాత్ర్యా పాపమకార్షం మనసా వాచా హస్తాభ్యాం పద్భ్యాముదరేణ శిశ్నా అహ స్తదవలుంపతు ఇదమహమాపో అమృతయోనౌ సూర్యే జ్యోతిషి (పరమాత్మని) జుహోమి స్వాహా అని ఉదయమునందును. (ఆ,గృహ్యాపసూ ఆ 1)

ఆపః పున న్తివ్రతిమంత్రస్య । నారాయణఋషిః । ఆపో దేవతా గాయత్రీ ఛందః । ఉదకప్రాశనేవినియోగః ॥

ఓం ఆపః పునన్తు పృథివీం పృథ్వీ పూతా పునాతు మామ్। పునన్తు బ్రహ్మణస్పతిర్బ్రహ్మపూతా పునాతు మామ్॥ యదుచ్ఛిష్టమభోజ్యఞ్చ యద్వా దుశ్చరితం మమ । సర్వం పునన్తు మామాపోఽసతాఞ్చ ప్రతిగ్రహం స్వాహా॥ అని మధ్యాహ్నమునందును అగ్నిశ్చమేతి నారాయణఋషిః । అగ్నిర్దేవతా । అనుష్టుప్ ఛందః । ఉదక ప్రాశనే వినియోగః । (ఆ,గృహ్యాప ఆ 1)

ఓం అగ్నిశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః పాపేభ్యో రక్షన్తాం యదహ్నాపాపమకార్షం మనసా వాచా హస్తాభ్యాం పద్భ్యాముదరేణ శిశ్నా అహ స్తదవలుమ్పతు యత్కించిద్దురితం మయి ఇదమహం మామమృతయోనౌ సత్యే జ్యోతిషి జుహోమిస్వాహా అని సాయంకాలమునందును సమన్త్రాచమనము చేయవలయును.

అథ పునరాచమ్య । కేశవనామములతో మఱల ఆచమనముచేసి

పునర్మార్జనమ్ ( 31 పు 2 పం )

ఓభూర్భువస్వః। ౧ ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి। ధియో యోనః ప్రచోదయాత్॥ ౨ ఆపో హి ష్ఠా మయో భువస్తా న ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే ౧ యో వః శి. వతమో రసస్తస్య భాజయతేహనః। ఉశతీరివ మాతరః ౨ తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ। ఆపో జనయథా చనః

వెనుక బాహ్యాభ్యంతర దోష నివృత్తి చేసికొనునప్పుడు గలిగిన దోషశాంతికయి పునమార్జనమని కొందఱనుచున్నారు 'పునర్మార్జనమునకయి విధానపారిజాతమునందు (అథ పునరాచమ్య మార్జయేత్ ప్రణవవ్యాహృతిభి (ర్ఋక్స్థ) ఆపోహిష్ఠేతి సూక్తేన గాయత్రీ శిరసా చామ్భసాత్మానం పరిషిఞ్చే దేతన్మార్జనమ్॥

## అఘమర్షణమ్.

ఈ అఘమర్షణము 'దుృపదాదివ' అను వెనుక జెప్పిన మంత్రముతో జేయవలయును. మార్జనవలననే పాపము తొలగి పోవుచున్నదని కొందరు దీనిని జేయుటలేదని విధానపారిజాత మను స్మృతి నిబంధనమందు గలదు.

## శత్రుక్షయార్ఘ్యమ్ ( 32 పు 4 పం )

* సుమిత్రియాన ఇత్యస్య ( మంత్రస్య ) ౧ ప్రజాపతిఋషిః ౨ ఆపోదేవతా 3 అనుష్టుప్ఛందః ౪ శత్రుక్షయార్థే వినియోగః

ఓం సుమిత్రియా న ఆప ఓషధయః సన్తుదుర్మిత్రియా స్తస్మైసన్తు యోఽస్మాన్ద్వేష్టి యం చ వయం ద్విష్మః॥ (అ. ౬ అ. ౫ ఖం ౪)

తా॥ ఓజలములార మాకు ఓషధులెల్ల స్నేహయుక్తము లయినవి (అనగా సంజీవిలతవలె మేలుజేయునవి) యగుగాక మఱియు ఎవడు మమ్ములను ద్వేషించుచున్నాడో (మాపై పగగొనుచున్నాడో) ఎవనిని మేము ద్వేషించుచున్నామో అట్టివానికా నోషధులెల్ల శత్రుభూతము లగుగాక (కీడుచేయుగాక) 'సుమిత్ర్యానఆప' అను

యజుస్సుతో జలమును దోసిలియందుబట్టి 'దుర్మిత్రాస్తస్మైసన్తు' అను యజుస్సుతో శత్రువును మనస్సునందు ధ్యానించి (తలచి) నేలమీదికి జక్కగా విసరివేయవలయునని స్నానసూత్రమునందున్నది. విధాన పారిజాతమునందలి సంధ్యావిధానమునందు జెప్పక స్నానవిధియందుమాత్రమే జెప్పుటచేత స్నానసమయమునం దుపయోగించుకొనుట ముఖ్యము. సర్వానుక్రమసూత్రమ్ సుమిత్రియాసఽఅంపమ్॥

## పాపక్షయార్థమార్జనమ్.

*ఇదమాప ఇత్యస్య (మంత్రస్య) ఉచక్థ్యఋషిః। ఆపో దేవతా। అనుష్టుప్ ఛందః। దురితక్షయార్థే వినియోగః॥

ఓం ఇదమాపః ప్రవహత యత్కించ దురితం మయి। యద్వాహమభిదుద్రోహ యద్వా శేపఽఉతానృతమ్॥ (అ 6 అను 5 ఖం 5)

ఓజలములార నేను అజ్ఞానమువలనగాని, బుద్ధిపూర్వకముగా నంతట ద్రోహము చేయుటవలనగాని, సాధుజనులను నిందించుటవలనగాని, మఱియు నబద్ధమాడుటవలనగాని కలిగిన దోషమును (మీ) ప్రవాహముతో నాకడనుండి తొలగించి వేఱొక తావునకు దీసికొనిపొండు. ఈమంత్రమును మధ్యాహ్న స్నానసమయమునందు కామ్యాఘమర్షణమునం దుపయోగింపదగినది. ఇందునకు ప్రమాణము విధాన పారిజాతమునందు (కామ్యాఘమర్షణే మన్త్రానాహ (యోగి) యాజ్ఞవల్క్యః జప్యాకా నామ గాయత్రీ వేదే వాజసనేయకే అన్తర్జలే సకృజ్జప్త్వా బ్రహ్మహత్యాం వ్యపోహతి॥ ఇదమాప ఇమం మన్త్రముక్త్వా హ్యేనోవిముచ్యతి। తద్విష్ణోరితిమన్త్రేణ స్నాయాదప్సుపునః పునః। గాయత్రీ వైష్ణవీ హ్యేషా ప్రాజాపత్యర్షికాస్మృతా॥) సర్వానుక్రమసూత్రమ్ ఇదమాపఽఆవ్యనుష్టుప్॥

## అర్ఘ్యమ్ (పు 32 పం 16)

అథాచమ్య (పునః ప్రాణానాయమ్య) ఆచమనము చేసి (అద్య) పూర్వోక్తైవంగుణవిశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం (ఉదయమాదు కాలాతిక్రమణ మయినచో) ప్రాయశ్చిత్తార్ఘ్యపూర్వకం ప్రాతరర్ఘ్యప్రదానం కరిష్యే అని చెప్పుకొనవలయును. ముఖ్యకాలము దాటనిచో (ప్రాతరర్ఘ్యప్రదానం కరిష్యే) అని చెప్పుకొనిన చా

లును. మధ్యాహ్నమునందు (మాధ్యాహ్నికార్ఘ్య ప్రదానం కరిష్యే (మధ్యాహ్నమునకు ముఖ్య కాలాతిక్రమణము లేదందురు.) సాయంకాలమునందు (సాయమర్ఘ్యప్రదానమహం కరిష్యే (అనియు) ముఖ్యకాలాతిక్రమణము అయినపుడు ప్రాయశ్చిత్తార్ఘ్యపూర్వకం సాయమర్ఘ్యప్రదానం కరిష్యే (అని చెప్పుకొనవలయును) ఉదయమున ప్రాయశ్చిత్తార్ఘ్యము.

ఉషస్త ఇత్యస్య (మంత్రస్య) గోతమఋషిః। ఉషోదేవతా। ఉష్ణిక్ ఛందః। ప్రాయశ్చిత్తార్ఘ్య ప్రదానే వినియోగః॥

ఓం ఉషస్తచ్చిత్రమా భరాస్మభ్యం వాజినీవతి। యేనతోకం చ తనయంచ ధామహే॥ శ్రీసూర్యనారాయణ పరబ్రహ్మణే నమః ఇదం ప్రాయశ్చిత్తార్ఘ్యం సమర్పయామి॥ (అ 33 అను 2 ఖం 2)

తా॥ ఓ వాజినీవతి (అనగా హవిర్లక్షణమైన అన్నముతో గూడిన క్రియకు వాజినియని పేరు అట్టిక్రియతో గూడినదానవగు ఉషోదేవత మాకు చిత్రమగు ధనమునిమ్ము. చిత్రమగుధనమెట్టిదనగా? ఏధనముతో పుత్రులను మనుమలను పోషించుకొనుచున్నామో అట్టిధనం హవిస్సుగలదానా యుషోదేవతా యిప్పటికినిక్షీణించక మాపుత్రులును పౌత్రులును గూడననుభవించునట్టి శాశ్వతైశ్వర్యము నొసంగుము ఈమంత్రమును ప్రాయశ్చిత్తార్ఘ్యమునందుపయోగింపవలెనని ఏస్మృతియందును చెప్పబడలేదనికొందరు సాహసింపవచ్చు ననుకొను నాకే స్మృతియందైయినదగిన ప్రమాణముజూపినచో వందనపూర్వకంగానందుకొనిసవరించుకొందును. కాలాతిక్రమణమయినపుడు (పురః శ్లో I) ప్రణవవ్యాహృతులతో గూడిన గాయత్రి శిరోమంత్రసహితముగ ముందర్ఘ్యమిచ్చుటగానిముమ్మారు ప్రాణాయామము చేయుటవలనగాని108 మారులు గాయత్రీజపము చేయుటవలనగాని ప్రాయశ్చిత్తమగుననిరి. విధానపారిజాతమునందు (ముఖ్యకాలే సంధ్యావన్దనాకరణే ప్రాయశ్చిత్తముచ్యతే తత్ర వ్యాసః॥ శ్లో॥ ఆదిత్యేఽభ్యుదయాద్యస్య సన్ధ్యోపాస్తిమకుర్వతః స్నాత్వాప్రాణాంస్త్రీనాయమ్య గాయత్ర్యష్టశతంజపేత్॥ పారిజాతేతు॥ కాలాతిక్రమణే చైవ చతుర్థార్ఘ్యం ప్రదాపయేత్॥ మధ్యాహ్నమునందు ప్రాయశ్చిత్తార్ఘ్యమున్నట్లెచ్చట నగపడదు. కానిమనపెద్దలు తాముముద్రింపించిన పుస్తకమునందు మధ్యాహ్నార్ఘ్య ప్రదానమునందలి మంత్రములనే ప్రాయశ్చిత్తార్ఘ్యముగా మార్చిరి కా॥ ఉషోదేవతోష్ణిక్

ఆకృష్ణేనేత్యస్య (మంత్రస్య) హిరణ్యస్తూపఋషిః సూర్యో దేవతా। త్రిష్టుప్ఛందః। ప్రాయశ్చిత్తార్ఘ్యప్రదానే వినియోగః॥

(ఓం ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యఞ్చ। హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి భువనాని పశ్యన్ ( అ 32 అ॥ ఖం 14 ) శ్రీసూర్యనారాయణ పరబ్రహ్మణేనమః ఇదం ప్రాయశ్చిత్తార్ఘ్యం సమర్పయామి॥

సూర్యు డంతరిక్షమార్గమున మఱలమఱల వచ్చుచు (ఉదయించుచు) అమృతము ను = చావులేని ప్రాణమును, మర్త్యం = చావుగల శరీరమును వానివాని స్థానముల యందు స్థాపించుచును, సర్వలోకములను ప్రకాశింపజేయుచును బంగారముతో జేయబడిన రథముతో నూసమీపమునకు వచ్చుచున్నాడు. సర్వానుక్రమసూత్రం ఆకృష్ణేన హిరణ్యస్తూప అంగీరసః॥)

ఉదుత్యమిస్య మంత్రస్య) ప్రస్కణ్వఋషిః। సూర్యో దేవతా। గాయత్రీఛందః। (మధ్యాహ్నార్ఘ్యప్రదానే) వినియోగః। ఉదుత్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః। దృశేవిశ్వాయ సూర్యమ్॥ ఈమంత్రమును సూర్యోపస్థానమునం దుపయోగించవలయు నని స్మృతులందుగలదుగాని ఇచ్చ నుపయోగమః యొచ్చటను జెప్పలేదు అర్థాదులు మధ్యాహ్నిక సూర్యోపస్థానమున వ్రాయబడును.

హగ్ంసః శుచిషదిత్యస్య ( మంత్రస్య ) వామదేవఋషిః। సూర్యో దేవతా। మధ్యాహ్నార్ఘ్యప్రదానే వినియోగః॥ ఓం హగ్ంసః శుచిషద్వసుర న్తరిక్షసద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్। నృషద్వర సదృతసద్వ్యోమసదబ్జా। గోజా ఋతజా అద్రిజా ఋతమ్బృహత్। (అ౧౧ అను ౭ ఖండ ౮)

తా॥ ఏపురుషుడు (నిత్యానిత్యాది) వివేకము కలుగుటవలన మాయనుగడచి మెలగునో ఆపురుషునకు సకలజగమును బ్రహ్మరూపమున తోచుచుండుననెడి యర్థమీ మంత్రమునందు దెలియజేయబడుచున్నది. ఇందులకై జగంబుననువదించి చెప్పుచున్నాడు. (హానహింగసాగత్యోః) అను ధాతువున హన్తియనగా నెల్లప్రుడును బోవుచుండువాడు గాన హంసయనగా సూర్యుడు అట్టివాడై అనగాసూర్య రూపంబున 'శుచిషత్' = శుద్ధం బగు జ్యోతిర్మండలంబునం దుండువాడు సూత్రాత్మస్వరూపంబున జగన్నివాస హేతు వగునది 'వసువు' అనగా వాయువు, వసురూపంబున 'అన్తరిక్షసత్ = ఆకాశమునం దుం

ష్టునది, హోమములకు నిష్పాదకమయి ఆహవనీయము లోనగు నామములుగలుగు అగ్నిరూపమున 'వేదిషత్' సోమయాగము లోనగు యాగములయందు అంగభూతముగ వేదియందుండునది అమావాస్యా తిథివిశేషంబున వపేక్షింపక భోజనమునకై యింటియందు దిగుగువాడు అతిథి, ఆరూపంబున దురోణసత్ అనగా పరులయిండ్ల నుండు వట్టివాడు మనుష్యులయందు కర్మాధికారియగు జీవునిరూపంబున నుండునదియు, కాశీ ద్వారవతి లోనగు శ్రేష్ఠములగు పుణ్యక్షేత్రములందు పూజనీయమగు తీర్థరూపమున నుండునదియు, ఋతంబనగా సత్యమును వేదోక్తమునగు కర్మమునందు తద్ఫలరూపంబున నుండునది యువ్యోమంబున (ఆకాశంబున) నక్షత్రాది (జ్యోతిః) స్వరూపంబున నుండునదియు, నదీసముద్రాది జలంబువలన శంఖములు, మకరములు మొదలగు రూపముల జనించినదియు, గోవులవలన క్షీరాదిరూపంబున జనించినదియు, ఋతంబనగా సత్యవచనము. అందు కీర్తిరూపంబున జనించినదియు అద్రులనగా పర్వతములు అందు వృక్షాదిరూపంబున జనించినదియు, నీతియన హంసము మొదలు అద్రిజమువరకు దెలియజేయబడిన యీ జగత్తంతయు ఋతంబనగా సత్యంబగు బృహత్తనగా బ్రహ్మము.

'ఆకృష్ణేన, హంసః' అను నీమంత్రములు రెంటికిని మధ్యాహ్నార్ఘ్య ప్రధానమునందేగాని ప్రాయశ్చిత్తార్ఘ్యమునందు గాదని విధాన పారిజాతమునందున్నది. (ఆకృష్ణయాహంసవత్యావాత్రిః సకృద్వార్ఘ్యమాత్రిష్యం)ఇక సాయంకాలమున ప్రాయశ్చిత్తార్ఘ్యము.

ఆరాత్రి ఇత్యస్య (మంత్రస్య) కుశికా భరద్వాజదుహితా ఋషిః రాత్రిదేవతా (పథ్యా) బృహతీఛందః । ప్రాయశ్చిత్తార్ఘ్యప్రదానే వినియోగః ॥

ఓం ఆ రాత్రిపార్థివగ్ంరజః పితురప్రాయి ధామభిః దివః సదాగ్ంసి బృహతీ వితిష్ఠస ఆ త్వేషం వర్తతే తమః ॥

( అధ్యా 33 అను 2 ఖండ 1 )

ఓ రాత్రి (ప్రేరకుడవగు నోభగవంతుడ) నీచే పృధ్వీసంబద్ధమైన లోకము, మధ్యమలోకముయొక్క స్థానములతో గూడ నంతట పూరింపబడినది స్వర్గలోకముయొక్క స్థానములనుగూడ మహదూపమును (మహదూపుడవగుచు) నాక్రమించుచున్నావు (అయినను) తమము అనగా (అజ్ఞాన) మనెడి అంధకార మావరించుచున్నది. రాత్రిప్రేరకుడవగు ఓభగవంతుడా నీవు ముల్లోకముల నావరించియున్నను తీవ్రమగు అజ్ఞానమంతట నగపడుచున్నదిగాన అట్టిఅజ్ఞానమును నశింపజేసి రక్షింపుమని తాత్పర్యము ॥

మనమే మంత్రమే క్రియయం దుపయోగించుకొనుట కెచ్చటనైన వేదో యొక ఋషివచనము ప్రమాణముండవలయుగదా ఇదివరకు మనపెద్దలు ముద్రించిన పుస్తకములలో నుదయమున ప్రాయశ్చిత్తార్ఘ్యము ' ఉపస్థ ' అను మంత్రముతోను మధ్యాహ్నమున ' ౧ ఆకృష్ణేన ౨ ఉదుత్యం ౩ హగ్ంసః ' అను నీమూడు మంత్రములతోను సాయంకాలమున ౧ ఆరాత్రి అను మంత్రముతో నీయవలయునని వ్రాసిరిగాని ఆయా కాలములందట్లు చేయుటకు ప్రమాణములే స్మృతులందును గానరావు. మధ్యాహ్నమున ప్రాయశ్చిత్తార్ఘ్యమునం దుపయోగించిన మంత్రములలో ' ఆకృష్ణేన ' హగ్ంసః అను రెండుమాత్రము ప్రాయశ్చిత్తమునం దుపయోగింపక అర్ఘ్యప్రధానమునం దుపయోగించ వలసినదని విధాన పారుజాతమునందున్నట్లు పైనవ్రాసితిని. కొందరిమతమున తత్సవితుః, అను మంత్రమును వ్యాహృతిత్రయముతో మధ్యాహ్నం దొకమారీ వలయుననియు మఱికొందరి మతమున ఆకృష్ణేన హగ్ంసః అను రెండు మంత్రములతో నీయవలయునని యున్నది.

సంధ్యకు ప్రాతఃకాలమున ' గాయత్రి ' యనియు మధ్యాహ్నము ' సావిత్రియనియు ' సాయంకాలమున ' సరసంతియనియు పేర్లుగలవుగాన ప్రాతఃకాలమున అర్ఘ్యప్రదానము॥

భూర్భువః స్వరితి మహావ్యాహృతీనాం పరమేష్ఠీ ప్రజాపతి-ర్ఋషిః। అగ్నివాయుసూర్యా దేవతాః। గాయత్ర్యుష్ణిగనుష్టుభశ్ఛందాంసి। గాయత్ర్యా (ఇక్కడనే మధ్యాహ్నమున సావిత్ర్యా అనియు సాయంకాలమున సరస్వత్యా అనియు జెప్పుకొనవలయును. నామభేదములేక తత్సవితుః అనికొందరు చెప్పుకొనుటయుగలదు. విశ్వామిత్రఋషిః సవితా దేవతా గాయత్రీఛందః అర్ఘ్యప్రదానే వినియోగః। ఓం భూర్భువః స్వః। ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్॥ (36 అ 1 అ 3 ఖం) శ్రీసూర్యనారాయణ పరబ్రహ్మణే నమః ఇదమర్ఘ్యం సమర్పయామి॥ అని ఉదయమున 3 మారులు మధ్యాహ్నమునందు 1 మారు సాయంత్రము 3 మారులు అర్ఘ్యము లియ్యవలెను.

అని అర్ఘ్యమిచ్చునపు డుండవలసిన నియమములు ౧ ప్రాతర్మధ్యాహ్నములందు నిలచి రెండుపాదములనుదగ్గరగజేర్చి చీలమండల నెత్తి యుంచుటయుం జలమునందుగాని, జలములేనపుడు శుభ్రమగు స్థలమునందువిడుచుట (౨) సాయంకాలమున కూర్చుని శుభ్ర

మగు స్థలమునందు వదలుట (3) అంగుష్ఠమును తర్జనిని గలయనీకుండుట అలాగా బొట్టన వ్రేలిని రెండవవ్రేలిని గలపకుండుట (4) అంజలియందుండు ఉదకము పుష్పములతో గాని లేనపుడు బిల్వపత్రములతో గాని కలసియుండుట (5) సూర్యుని జూచుచు (గోశృంగ మాత్రము) ప్రాదేశమాత్రమెత్తివదలుట—కొందరు గాయత్రియొక్క ప్రయోగముచే ములు వచ్చుటలేదని, "ఉత్తిష్ఠ దేవి గన్తవ్యం పునరాగమనాయ చ। ఉత్తిష్ఠ దేవి స్థాతవ్యం ప్రవిశ్య హృదయం మమ॥" అని కొందరును॥ మరికొందరు

అంజలియందు జలముపట్టి బ్రహ్మాస్త్రము, బ్రహ్మదండము శక్తిని ప్రయోగించవలయుననియు(34 పుట 20 పంక్తి) చెప్పుచున్నారు. ఇదంతయు తాంత్రికసంధ్యావిషయము కాని వైదికసంధ్యావిషయము కాదనియు వేదమునందును తదనుసారములగు మన్వాదిస్మృతులందును చెప్పకుండుటచే జేయనక్కరలేదని కొందరియభిప్రాయము. కావలసినవారు 35 పుట జూచుకొనవచ్చును. గాయత్రీమంత్రముతో నర్ఘ్యమిచ్చి నాసాదక్షిణరంధ్రముగుండ ములు తేజస్సును శిరోమంత్రముతో ఆధారమండపమునందు స్థాపించుకొనవలయునని ఆశ్వలాయనుని మతము (38 పుట 4 పంక్తి)

## సూర్యోపస్థానమ్ (35 పుట 18 పంక్తి)

(ప్రాతఃకాలే) మిత్రస్యేత్యాది పంచానాం మంత్రాణాం గాయత్రీఛందః ప్రథమస్య విశ్వేదేవా ఋషయః। ద్వితీయచతుర్థయోః శ్యావాశ్వోనామఋషిః। తృతీయస్య విశ్వామిత్రఋషిః। పంచమస్య మేధాతిథిఋషిః। ఆద్యస్య మిత్రోదేవతా। ఇతరేషాం చతుర్ణాం మంత్రాణాం సూర్యోదేవతా సూర్యోపస్థానే వినియోగః॥

ఓం మిత్రస్య చర్షణీధృతోఽవో దేవస్య సానసి। ద్యుమ్నం చిత్రశ్రవస్తమమ్॥ (12.6.3) దేవ సవితః ప్రసువ యజ్ఞం ప్రసువ యజ్ఞపతిం భగాయ। దివ్యోగన్ధర్వః కేతపూః కేతం నః పునాతు। వాచస్పతిర్వాచం నః స్వదతు (12.1.7) తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్ (3.3.27) విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ। యద్భద్రం తన్న ఆసువ (34-1-3)

విభక్తారగ్ం హవామహే వసోశ్చిత్రస్య రాధసః । సవితారం నృచక్షసమ్॥ (34-1-4)

మిత్రస్యేత్యస్యమంత్రస్య। విశ్వామిత్రఋషిః। మిత్రోదేవతా। గాయత్రీఛందః। దేవసవితురిత్యాది చతుర్ణాంమంత్రాణాం। సవితాదేవతా। ప్రథమతృతీయయోర్నారాయణఋషిః। ద్వితీయస్య విశ్వామిత్రఋషిః। చతుర్థస్య మేధాతిథిఋషిః। అద్యస్యత్రిష్టుప్ ఛందః। ఇతరేషాంత్రయాణాం మంత్రాణాంగాయత్రీఛందః। సూర్యోపస్థానే వినియోగః॥ అని చెప్పబడిన ఋషిదేవతాదులు తప్పుగానుండును॥

స్మృతులందు 'మిత్రస్య' అను మంత్రము మొదలు వరుసగా మూడింటితో సూర్యోపస్థానము జెప్పవలయునని కలదుగాని 34 వ యధ్యాయమునందుగల పురుష మేధమునందు సూర్యావాహనకై వినియోగింపబడుచున్న దేవసవిత అను వరుస నాల్గు మంత్రములిచ్చుట నుపయోగింపవలయునని యేధర్మశాస్త్రమునందు గలదో తెలియ రాకున్నది. ౧ (మిత్రస్య) తా॥మేము మనుష్యులను భరించువాడును దీప్యమానుడును నగు సూర్యునియొక్క సనాతనమైన రక్షణమును, మిగుల వినదగిన యశస్సును ప్రార్థించు చున్నాము (౨) (దేవసవిత) సర్వమునకు నంతర్యామి (లోపలనుండువాడు) వగు ఓ దేవా ... మును నడపుము మఱియు ననుష్ఠానరూపమగు నైశ్వర్యముకొఱకు ప్రేరేపించుము. ఈతీరున మండలాధిష్టుడగు పురుషునిజెప్పి ఇప్పుడు మండలమునుగూర్చి చెప్పు చున్నాడు. నీప్రసాదముచే దివ్యమగు కిరణములను ధరించువాడును కేతమనగా అన్నము దానిని శుద్ధిజేయువాడును నగు సూర్యమండల రూపదేవుడు మాఅన్నము శుద్ధిజేయుగాక మఱియు నీప్రసాదమువలన ప్రజాపతి మాహవిర్లక్షణమైన అన్నము నాస్వాదించుగాక (3) గాయత్రీ... తమునకు ముందువివరముగా దెలుపబడును (౪)(విశ్వాని) ఓ సవిత పాపములను దొలగించి శుభము గలిగించుదానిని మాకొసగుము (౫) విభక్తారం) వసువుయొక్క చిత్రమగు ధనమును వారివారి కర్మానుసారము పంచియిచ్చువాడును, ఏమనుష్యుల నెట్లు జూడవలయునో వారి నాలాగున జూచువాడును నగు సవితను మేము బిలుచుచున్నాము॥

విధాన పారిజాతమునందు సూర్యోపస్థానము జేయుక్రమము మీక్రిందివిధముగా నున్నది. (సూర్యోపస్థానే విశేషమాహ శ్లో॥ హస్తాభ్యాంస్వస్తికంకృత్వా ప్రాతస్తిష్ఠేద్దివాకరం। మధ్యాహ్నేతుఋజూబాహూ సాయంముకుళితాకరా॥ తత్రమన్త్రవిశేషమాహ దేవలః॥ శ్లో॥ మిత్రస్య చర్షణీ స్తిస్రో శసవ స్త్వేతి చోదయేత్ । ఇమంమేతి చతుష్కేణ సాయం కుర్యాదుపస్థితిమ్॥ ఇట్లుండుటచేత ఉదయమున సూర్యోపస్థానము॥

మిత్రస్యేత్యాదిత్రయాణాం మంత్రాణాం। విశ్వామిత్రఋషిః

మిత్రో దేవతా ఆద్యస్య గాయత్రీఛందః। ద్వితీయతృతీయయోర్బృహతీఛందః। సర్వేషాం సూర్యోపస్థానే వినియోగః॥ ఓం మిత్రస్య చర్షణీధృతోఽవో దేవస్య సానసి। ద్యుమ్నంచిత్రశ్రవస్తమమ్॥ దేవస్త్వాసవితోద్వపతు సుపాణిః స్వఙ్గురిః సుబాహురుత శక్త్యా। అవ్యథమానాపృథివ్యామాశా దిశ ఆపృణఉత్థాయ బృహతీ భవోదు తిష్ఠధ్రువాత్వమ్। మిత్రైతాంతఉఖాం పరిదదామ్యభిత్త్యాఽఏషా మాభేది॥ (అధ్యా 12 అను 6 ఖండ 3-4-5)

(మాధ్యాహ్నికకాలే) ఉద్వయముదిత్యమితిద్వయోః ప్రస్కణ్వఋషిః సవితా దేవతా। ప్రథమస్యానుష్టుప్ ఛందః। ద్వితీయస్య గాయత్రీఛందః। చిత్రందేవానామిత్యస్య కుత్సఋషిః సవితా దేవతా। త్రిష్టుప్ ఛందః। తచ్చక్షురిత్యస్య దధ్యఙ్ఙాథర్వణఋషిః। సూర్యోదేవతా। పంక్తిశ్ఛందః। సూర్యోపస్థానేవినియోగః (అనిచెప్పవలసినదానికి) ఉద్వయం, ఉదుత్యం, చిత్రం తచ్చక్షురిత్యేతేషాం, మంత్రాణాం। గాయత్రీఛందః కణ్వపుత్రప్రస్కణ్వఋషిః। సూర్యోదేవతా। సూర్యోపస్థానేవినియోగః (అని ఋషిదేవతాదులు సంబంధములేకయే చెప్పుచున్నారు).

ఓం ఉద్వయం తమసస్పరి స్వః పశ్యన్త ఉత్తరమ్। దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్॥ ఉదుత్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః। దృశే విశ్వాయ సూర్యమ్॥ చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః। ఆప్రాద్యావా-

పృథివీ అన్తరిక్షగ్ంసూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ॥ తచ్చక్షుర్దేవ-హితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్। పశ్యేమ శరదః శతం జీవేమ శర-దః శతగ్ం శృణుయామ శరదః శతమ్ ॥ (ఉద్వ అ 22-1-7 ఉదు అ 9-2-1 చిత్రం 8-17-1 తచ్చక్షు 36-1-24.)

సూత్రమునందు (35 పుట 19 పంక్తి) 'ఉద్వయముదుత్యం చిత్రంతచ్చక్షుర్గాయత్ర్యా చ' అని యుండగా నేల గాయత్రిని మాత్రము వదలి మిగిలిన మంత్రములతో సూర్యోపస్థానము జెప్పుచున్నారో తెలియకున్నది మఱియు శక్త్యనుసారముగ విభ్రాడనువాకము, పురుషసూక్తము, శివసంకల్పము, మండలబ్రాహ్మణము వీనితో గూడ చేతులెత్తి చెప్పుమని సూత్రమునందే కలదు. తా॥ (ఉద్వయం) శ్రేష్ఠతరమగు స్వర్గలోకమును జూచుచు చీకటిమెంతుగా నిండుకొన్న (లేక మిగుల అజ్ఞానముతో గూడిన) మాలోకమునుండి వెలికివచ్చితిమి (పాపరహితులమైతిమి) మఱియు దేవలోకమున నుండు (లేక దేవులందరికన్న దానాదిగుణములతో గూడియున్న) వాడగు సూర్యుని స్తోత్రములచే నుపాసించుచు సూర్యరూపమగు తేజస్సును బొందితిమి (బ్రహ్మ స్వరూపము నంటితిమని యర్థము) సూర్యదేవత్యానుష్టుప్ ప్రస్కణ్వఋషిః। (ఉదుత్యం) ద్యోతమానుడును లేక ఆకాశమునందుండువాడును (జ్ఞానమునుగాని ధనమునుగాని కలిగించువాడనియుకూడ నర్థము) సర్వమునకు ప్రేరకుడునగు ఆదిత్యునకు కిరణము లూర్ధ్వముగా బోవుచున్నవి. ఎందుకన జగత్తును జూచుటకు (వ్యాపించుటకు) జనులందరెట్లు జూచుచున్నారో యట్లే యూర్ధ్వముఖముగా వహించుచున్నవని యర్థము. సూర్యదేవత్యా గాయత్రీప్రస్కణ్వః (చిత్రందేవనాం) ఇచ్చట పరాపరరూపము చేనున్న సూర్యుడు స్తోత్రము చేయబడుచున్నాడు. సూర్యుడాశ్చర్య కరమగునట్లుదయించెను. (ఉదయించుచు స్వప్రకాశముచే చీకటిని బోగొట్టుచు ఇతరములకు ప్రకాశమునిచ్చుట ఆశ్చర్యము) కిరణ సమూహమునకు గాని దేవతాసమూహమునకుగాని ఆశ్రయుడైనట్లే మిత్రవరుణాగ్నులకు నేత్రమువలె ప్రకాశకుడని యర్థము.

అందుచే మిత్రాదులకు చక్షువగు సూర్యుడుదయించి భూమ్యాకాశములను దన తేజస్సుచే నిండించుచున్నాడు ఈతీరున అపరరూపముచే స్తుతించి పరరూపముచే స్తోత్రము చేయుచున్నాడు. జగమునందలి స్థావర జంగమములకు నంతర్యామియైనవాడు. (మమ్మురక్షించుగాక) పురీతిష్టుప్ కుత్సదృష్టా (తచ్చక్షు) ఈమంత్రములచే నేమహావీరుడు మాచే స్తోత్రముచేయబడెనో అట్టి చక్షువగు అనగా జగములకు నేత్రభూతమగు ఆదిత్యరూపము తూర్పుదిక్కునందుదయించుచున్నది. అదెట్టిదన దేవతలచే స్థాపింపబడినది (లేక) దేవతల కిష్టమైనదియు శుద్ధమైనది (ప్రకాశముగలది పాపాసంస్పృష్ట

హైనదని యర్థాంతరములు) అట్టిదానియొక్క ప్రసాదముచే నూరుసంవత్సరముల పర్యంతము ఆరోగ్యైశ్వర్యములతో గూడియుందుము అట్లే అపరాధీన జీవనులమగుచును పరమాత్ముని శృతివాక్యములతో వినెదము. (తచ్చక్షుః సంక్తిః సౌరీ)

(సాయంకాలే). ఇమంమేవరుణ। తత్వాయామీత్యనయోర్మంత్రయోః శునశ్శేప ఋషిః। వరుణో దేవతా। ప్రథమస్య గాయత్రీ ఛందః। ద్వితీయస్య త్రిష్టుప్ఛందః। సూర్యోపస్థానే వినియోగః। (అనుదానికిబదులుగా) ఇమంమేవరుణేత్యస్య మంత్రస్య గాయత్రీఛందః తత్వాయామీత్యస్య మంత్రస్య త్రిష్టుప్ఛందః ఉభయోః శునశ్శేప ఋషిః।వరుణోదేవతా।సూర్యోపస్థానేవినియోగః। (అని చెప్పుచున్నారు)

ఓం ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృళయ। త్వామవస్యురాచకే॥ తత్త్వాయామి బ్రహ్మణా వన్దమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః। అహేళమానో వరుణేహ బోధ్యురుశగ్ంస మా న ఆయుః ప్రమోషీః॥ (ఇమం 23-1-1 తత్వాయామి 23-1-2)

నేను జూచినంతలో ఋషిదేవతాదులను తత్వాలేక వ్రాసినది యీ రెండు మంత్రములకును గాయత్రికిని (ఇమంమే) ఓవరుణుడ రక్షింపుమని ప్రత్యక్షమగు మంత్రవాక్కులతో నిన్ను నేజేయు వాహ్వానమును వినుము మఱియు కాలవిలంబనము జేయక గాపాడుమని కోరుచున్న నన్ను సుఖింపజేయుము. సూ॥ వరుణదేవత్యే గాయత్రీత్రిష్టుభౌ శునఃశేపదృష్టే॥ (తత్వాయామి) ఓవరుణ ఏవస్తువును యజమానుడు హవిస్సులతో (హవిస్సులనిచ్చి) గోరుచున్నాడో యావస్తువును నిన్ను యాచించుచున్నాను. మిక్కిలి కొనియాడబడు వరుణుడ కోపపడక నీలా కవుండు నన్ను జాగ్రత్తతో జూగుము మఱియు మాయొక్క యాయుష్యును నాశముజేయకుము. కాత్యాయనసూత్రమ్ తత్వావారుణీం త్రిష్టుభగ్ం శునఃశేపః॥

## ప్రదక్షిణమంత్రః

అసావాదిత్యేత్యస్యమంత్రస్య। బ్రహ్మఋషిః। ఆదిత్యోదేవతా అనుష్టుప్ఛందః। భూప్రదక్షిణే వినియోగః। (అని వ్రాసిరి) ఇది చిన్నివాక్యము దీనికి ఋషిదేవతాదులు దేనినిబట్టి యట్లువ్రాసిరో తెలియదు.

అసావాదిత్యో బ్రహ్మ (ఆ, గృహ్యాప, అ ౧)

తా॥ మనకన్నులకగపడు నీయాదిత్యుడే బ్రహ్మమని ప్రదక్షిణముగా తిరుగుచు పరిషేచనము (చుట్టును నీళ్ళు విడుచుట) జేయుమని కలదు. (అర్ఘ్యానన్తరం సన్ధ్యాతర్పణముక్తమ్) అర్ఘ్యానన్తరము సంధ్యాతర్పణము జేయుమని విధాన పారిజాతమునందు వ్రాసెను. ఏల మనవారు సేయకున్నారో తెలియదు. (శౌనకః, అర్ఘ్యాన్తే వాజసనేయినాం కణ్వానాం సంధ్యాసు తర్పణం కార్యం స్మృత్వా ఋష్యాదికం తతః)॥ ఋషిర్వ్యాసః సముద్దిష్టో బ్రహ్మ దైవతముచ్యతే। ఛన్దో గాయత్రీ ఇంచైవ వినియోగస్తు తర్పణే॥ అనియున్నది. ఈ తర్పణమునకు మరొక చిన్నవిషయము తెలిసికొనవలసియున్నది. మనవారలు 'తర్పయామి' అనినచో తైత్తిరీయమనియు 'తృప్యతామ్' అనగా వాజసనేయమనియు దలచుచున్నారు గాని 'తర్పయామి' అనుట కాత్యాయన మతమనియు 'తృప్యతామ్' అనుట యోగియాజ్ఞవల్క్య మతమనియు నెఱుగరని యనుకొనవలసి వచ్చినది. (విధానపారిజాతే, యోగీతు శ్లో॥ తృప్యత్విత్యనుచ్చార్య తృప్యతామిత్యథాపివా। విధిజ్ఞః ప్రక్షిపేత్తోయం దేవాదీనామ శేషతః॥ అనుం తర్పయామీతి వా ప్రయోగః। నామాన్తే తర్పయామీత్యాదావోమితి చ బ్రువన్। ఇతి కాత్యాయనోక్తేః। తథా చ యథామాత్రం ప్రయోగవ్యవస్థా ద్రష్టవ్యా॥ గాన ఈ దయమున సంధ్యాతర్పణము.

ప్రయోగస్తు. ఓం భూః పురుషం తర్పయామి। ఓమృగ్వేదం తర్పయామి। ఓం మండలం తర్పయామి। ఓం హిరణ్యగర్భరూపిణం తర్పయామి। ఓం ఆత్మానం తర్పయామి। ఓం గాయత్రీం తర్పయామి। ఓం వేదమాతరం తర్పయామి। ఓం సాఙ్కృతిం తర్పయామి। ఓం సన్ధ్యాం తర్పయామి। ఓం కుమారీం తర్పయామి। ఓం బ్రాహ్మీం తర్పయామి। ఓముషసం తర్పయామి। ఓం నిర్మృజం తర్పయామి। ఓం సర్వసిద్ధికరీం తర్పయామి। ఓం సర్వమన్త్రాధిపతీం స్తర్పయామి। (ఆదౌ ప్రణవముచ్చార్య తర్పయీత తదన్తికే। అనేన విధినా కుర్యాత్ సన్ధ్యాతర్పణముత్తమమ్ ।) కాత్యాయనసూత్రులయ్యు 'తర్పయామి'.

అనిచేయుటనిష్టము లేనిచో నామములను ప్రథమాంతములుగా మార్చి (తృప్యతాం) అని చెప్పుకొనుడి;—ఓం భూః పురుష స్తృప్యతామ్। ఓం ఋగ్వేద స్తృ। ఇట్లే తక్కినవానికిని. మధ్యాహ్నమున సంధ్యాదర్పణము?—

సావిత్ర్యాః కస్యపస్త్రిష్టుప్। మధ్యాహ్నసంధ్యాతర్పణేవి-
నియోగః। ఓం భువః పురుషం తర్పయామి। ఓం యజుర్వేదం। ఓం
మండలం। ఓం రుద్రరూపిణం। ఓమన్తరాత్మానం। ఓం సావిత్రీం।
ఓం వేదమాతరం। ఓం సాఙ్కృతిం। ఓం సన్ధ్యాం। ఓం యువతిం।
ఓం రౌద్రీం। ఓం ముషసం। ఓం నిమృజం। ఓం సర్వార్థసిద్ధికరీం।
ఓం సర్వమన్త్రాధిపతిం। ఓంభూర్భువః స్వః పురుషమ్। 'తర్పయామి'

అని ప్రతిపదమునకు చివరచేర్చి పలుకవలెను. సాయంకాలమున సంధ్యాతర్పణము.

సర్వస్వత్యా వశిష్ఠ ఋషిర్విష్ణుర్దేవతా జగతీచ్ఛందః సాయం
సన్ధ్యాతర్పణే వినియోగః। ఓం స్వః పురుషం తర్పయామి। ఓంమం-
డలం। ఓం విష్ణురూపిణం। ఓం పరమాత్మానం। ఓం సరస్వతీం। ఓం
వేదమాతరం। ఓం సాఙ్కృతిం। ఓం వృద్ధాం। ఓం వైష్ణవీం। ఓ
ముషసం। ఓం నిర్మృజీం। ఓం సర్వార్థసిద్ధికరీం। ఓం సర్వమన్త్రాధి-
పతిం। ఓం భూర్భువః స్వః పురుషం (తర్పయామి)

అని ప్రతిపదము తుదనుచేర్చి పలుకవలెను. (పిమ్మట ఆచమనము చేయవలయును.)

అథగాయత్రీజపః. (పుట 37పంక్తి 11)

శ్లో॥ ఉగ్రభూత పిశాచాస్తే ఇత్యేతేభూమిభారకాః।
భూతానామవిరోధేన బ్రహ్మకర్మసమారభే॥

కూర్చుండుటెది ఆచమనమేది ప్రాణాయామమేమయ్యెను, సంకల్పమెట్లుబోయెను వీనిని తెలుపకయే యిష్టమువచ్చినట్లు ముందుగా కొన్ని మంత్రములను ఆచమనాదుల తర్వాత కొన్ని మంత్రములను జెప్పిరే ఒక్కొకదానిని రెండేసి మూడేసి ముక్కలుచేసి చెప్పుచున్నారే ఇట్లుచేయుమని యెచ్చటనున్నది. వీనిని తెలుసుకొనెదమనగ స్మృతులుగాని ఇవియెట్లూహించి వ్రాసిరో వారుగానిలేరే. యెట్లు తెలిసికొననగునో కేవల మూఢ్పుస్తకమునం దభిమానముగలవారు తెలుపుదురుగాక. అయినను ఒక్కొకటి విమర్శిచి చూతము. ౧ (ప్రణవస్యపరబ్రహ్మఋషిః) అనిచెప్పిన వ్యాహృతులు శిరోమంత్రము గాయత్రి వీనిలో మొదట ప్రయోజనమేమి జ్ఞాపకము చేసుకొనుటకా ? )

ఓం ఓజోఽసి సహోఽసి బలమసి భ్రాజోఽసి దేవానాం ధామనామాఽసి విశ్వమసి విశ్వాయుః సర్వమసి సర్వాయురభిభూరోం గాయత్రీమావాహయామి సావిత్రీమావాహయామి సరస్వతీమావాహయామి ఛన్దర్షీనావాహయామి శ్రియమావాహయామి గాయత్రియా గాయత్రీ ఛన్దో విశ్వామిత్రఋషిః సవితా దేవతాఽగ్నిర్ముఖం బ్రహ్మశిరో విష్ణుర్హృదయం రుద్రః శిఖా పృథివీ యోనిః ప్రాణాపాన వ్యానోదాన సమానా సప్రాణా శ్వేతవర్ణా సాంఖ్యాయనసగోత్రా గాయత్రీ చతుర్విగ్ంశత్యక్షరా త్రిపదా షట్కుక్షిః పఞ్చశీర్షోపనయనే వినియోగః॥ తై, ఆ, ప్ర ౧౦ అ ౩౫

ఆయాత్విత్యనువాకస్య వామదేవఋషిః। గాయత్రీ దేవతా। అనుష్టుప్ఛందః। గాయత్ర్యావాహనే వినియోగః। ఓం ఆయాతు వరదా దేవీ అక్షరం బ్రహ్మసమ్మితం। గాయత్రీ ఛందసాం మాతేదం బ్రహ్మజుషస్వ మే॥ (తై, ఆ, ప్ర ౧౦ అ ౩౪)

ఈ రెండు మంత్రములను తైత్తిరీయులు గాయత్ర్యావాహనకము వినియోగించుచున్నారు. మనవారు ఓజోసి అను మంత్రమును ముక్కలుగ చేసి క్రిందుమీదు మీదుక్రిందుగా మార్చి అనవసరమైనదానిని చెప్పుచున్నారు వాజసనేయులనబడు కాణ్వాది పదునైదు శాఖలవారలకు ఉపయోగపడు అనంతాహ్నికము, ఆహ్నికతత్త్వము, ఆహ్నికసంగ్రహము, ఆహ్నికవిధి మొదలుగాగలవానియందు "తేజోసి" అను మంత్రముతో గాయత్ర్యావాహనమును, "గాయత్ర్యస్యేకపది" అనుమంత్రముతో ప్రార్థనమును, 'నమస్తే తురీయాయ' అనుమంత్రముతో నమస్కారమును చేసి వ్యాహృతిత్రయముతో గాయత్రిని జపించుమని యున్నది. ఆయాత్విత్యనువాకేన హృదయే చార్కమండలే। దేవీమావాహ్య గాయత్రీం తతో ధ్యాయేద్ద్విజోత్తమః॥ అని ప్రమాణమున్నదిగాన ఆవాహనకై యుపయోగించిరి.

తేజోసీత్యస్య మంత్రస్య। ప్రజాపతిఋషిః। సువర్ణనిష్కా దేవతా। అనుష్టుప్ఛందః। గాయత్ర్యావాహనే వినియోగః॥ ఓం తేజోఽసి శుక్రమమృతమాయుష్మా ఆయుర్మే పాహి॥

